దవానలభక్షణము.

ఉ॥ కాళియసర్పమున్ విడిచి కంజదళాక్షుఁడు నిర్గమింప గో
పాలురు నందముఖ్యులును బంధుగణంబు గడున్ సంతసించి రా
త్రై లలిఁ గాఱుచిచ్చుఁ బొదువంగ ననంతుఁడు గ్రోలిలీలమైఁ
గేళివనంబునం దునిమెఁ గృష్ణుఁడు గాడ్పుబలెం బ్రలంబునిన్॥ 66

మ॥ నిలువుండీరముఁ జొచ్చెఁ జిచ్చుపసులన్ నిండారఁగాఁ బైగలం
బిలువుండీరమరం గనుంగొనకుఁ డీపీడం దొలంగించుమీ
చెలువుండీఱము గామఖంతమని యాచిచ్చున్ వడిన్ మ్రింగి తా
నలభాండీరముఁ జేర్చె వారి హరి కవ్యాక్షిప్త డిండీరమున్
దళడిండీరము, కాననాబ్ధికి మధూద్యద్గండ పిండారమున్॥ 67

గోపీవస్త్రాపహారణము.

సీ॥ పల్లెవన్నెవులుల్లసిల్ల నల్లనిగొల్లపిల్ల పిల్లనగ్రోవి పెదవిఁ బొదవి
మెల్ల మెల్లన నూఁది యుల్లిబిల్లిగ మూదిగోళ్ల వేళ్లను బాఁదుకొలిపి వొలపి
త్రుళ్లిమ్రోల్లిగురింపఁ జల్లచల్లఁగ రాగమల్లనల్లనఁ బాడునను చుఁజను చుఁ
దల్లిపిల్లనుఁ బిల్లతల్లినాల్లకవిని గొల్లతల్లలి మరులొల్కనుము ననుచు
నుల్లమునఁ బొల్చినదినిల్చి యుల్లెలొల్చి। మొల్లముగఁ బెట్టి నీరాడఁ గొల్లఁ గొట్టి
యుల్లసములాడి మెఱచి సిగ్గెల్లఁ జెఱచి। వల్లవుండయ్యె రాధికావల్లభుండు॥ 68

విప్రవనితాశాపవిమోచనము.

మ॥ పసులంగాచుచు నాఁకటం బడలు గోపశ్రేణి నంపించి భా
త్రినురుల్ పొందన వారియాంద్రకడఁ గోరింపన్ సతుల్ భక్ష్య భో
జ్యసమేతంబుగ వచ్చియిచ్చిరఖి మోక్షంబిచ్చె తచ్ఛాయల
వ్యసుధాదిత్యుల చేరఁ బంచె హరి తత్ప్రాగ్జన్మశాపఘ్నుఁడై॥ 69

విప్రవనితాశాపకారణము.

మ॥ ఇవి యొట్లన్న వెలుంగుఁ డాంగిరసు లగ్నిచ్ఛన్ విమర్శింపకీ
ముదితల్ మోహితలైరటన్న భ్రమచే మున్ను గ్రకోపంబొసం
గి పయన్నిక్క మెఱింగి కృష్ణకృప ముక్తిం గాంచి మీచాయలన్
నుదతిత్వంబు వహించి మమ్మెత్తనయుఁ డంచుం బల్కి వీరైరిటుల్॥ 70

గోవర్ధనోద్ధరణము.

సీ॥ ఏఁటేఁట జరిందు నింద్రయాగము మాన్పి శైలేంద్రయాగనిశ్చయ మొనర్చి
గోవులకును భూమిదేవులకును దీనజీవులకును దృప్తిఁ జేయఁ బనిచి

గిరిరూపధారియైకృష్ణుండు నందాదులొసంగినవరదపాయసములెల్లఁ
దానారగింపఁబంతము నవింద్రుఁడు సప్తవాసరంబులు జాల్లవానగురియ
గోవులను గోపికలనెల్లగోపకులను । గావ గోవర్ధనంబెత్తి కదలకుండ
గొడుగుగాఁబట్టుటరసి శక్రుండు వేడ।నతనిరక్షించె సప్తమహాయనమున॥ 71

ఇంద్రప్రార్థనాంగీకారము.

మ॥ వెరఁగై యింద్రుఁడుచిక్కి మ్రొక్కి సుతుఁడావిష్వచ్ఛపై వత్సల
త్వ రమం బాయకప్రోవుమంచుఁబలుకం బ్రాణంబులప్పాండవుల్
ధరయేలింతును వారిచే రణములో ధాత్రీభరంబెల్లఁ దీ
ర్తు రహిం గంసముఖాదులందునిమి తోడ్తోనంచు గృష్ణుండ నెన్॥ 72

సర్వలోకప్రదర్శనాదిప్రశంస.

చ॥ వ్రతమొనరింప నందుఁడొకవాసరమందసురార్ధవేళ నా
ప్లుతుఁడగుచుండఁగా వరుణలోకముఁ జేర్చిరితద్భటుల్ మహా
ద్భుతముగఁగృష్ణుఁడేఁగి పితఁదోడ్కొనిరా వెఱగందిరంద ర
చ్యుతుఁడును సర్వలోకములఁ జూపెఁ దదర్థనపార్థకంబుగన్॥ 73

సాయంకాలాద్యభివర్ణనము.

ఉ॥ అంత దినాంతమయ్యె హరిదంతరదంతురకాంతిశాఖి శా
ఖాంతర సంతరాయతనిజాతుత నాపతనాతనూద్యమా
ద్భ్రాంతశకుంతమంతికదురంత వియోగభయాగళితక్షత
స్వాంతనితాంతతాఁతమదనాకలనాకుల కోకకాంతనై॥ 74

* మ॥ అపరాద్రీభవిభుండురాకతతి ఛాయానక్రసంగ్రస్తదే
హపరార్థుండగుమన్ విభావసుతుఁడాటాలించి మేలెంచి శా
లపయోజాత్ముఁడులీలఁదద్గ్రహముదూలన్ సూర్యచక్రంబువై
చి పడంగొట్టఁగఁజిమ్ముర క్తమనమింశన్ సాంధ్యరాగంబొగిన్॥ 75

క॥ ఇనశశులిరుమొగములు లొం।ఛనమగ లలిగరిణి కిరణజాలమువానై
తనరెడురోదసిమద్దెల ।యనఁదగె ఖగరుతములుగొమకులదిగాదుగదా॥ 76

చంద్రోదయవర్ణనము.

క॥ ఉదయాచలపలిత్రికా । భ్యుదితసమయభోగిభోగమోయనఁ జంద్రుం
డు దనర్చెఁదత్కళంకము।మృదురుచియగు కృష్ణపాదమే కాదుగదా॥ 77

---

*పద్యాంతరము॥క॥అపరగిరికరితనుపనా।తపమకరిగ్రహించుచుటెఁకెగితకటియను హరియుం
దపన సుదర్శనమునఁద । ద్రిభుఁ గ్రుమతఁగఁ గ్రముత నెత్తు శేసంజగదా॥

క॥ చదలనెడుజమునమడువునఁ । బొదలు సమయకాళియాహిభోగఫలకతు
ట్లుదితశశిబింబమలరెం । దదంకము యదూద్వహాంఘ్రిపదముగాదుగదా॥ 78

క॥ మిన్ననియెడిమున్నీటన్ । భిన్నంబగుశుక్తి రణించెంబెసలారన్
వెన్నెలదొర తాంకలుస । మున్నలిఁ బైఁబడినముత్యములుగావుగదా॥ 79

సీ॥ అలశరద్రాత్రియందలరుచుఁ గృష్ణుండుమురళి వాయింపఁగా ముదితలెల్లఁ
దమపనుల్ విడిచి తత్సన్నిధి కేగిరి దారానిసతులుతత్ప్రవణచిత్త
లైముక్తిఁగనిరున్న యన్నుమిన్నలఁగని వెన్నుఁడెన్నెన్నియో విధులు దెల్పి
పొమ్మన్నఁ బోకున్న మురిసి కన్పడకున్న వెదకియుఁ గనలేక విధికి కొసకు
తనత్రయతఁ గాంచి జనాత్రుదితచ్చరితలు । దామె యొనరించి మధురగీతములఁ బాడ
దయగలిఁగి తోఁచి బ్రతిమాలి దానవారి । దానువారిరాసక్రీడఁ దనిసి తనిపె॥ 80

## సరోవరవర్ణనము.

చ॥ పరిపరి కేళికూళియను పల్లెరమం దరపోద్భుతమిత్రకీ
ల్బరిణలఁ గ్రమత్రుతుమెత్రన కొలమత్రలపేరిఁటి వేల్పుతాలఁ గొ
ల్వరహీవహించి గట్టుపయిఁ జుట్టునుఁ బుట్టినమ్రాకులానులున్
విరులును బువ్వుఁదేనియలు పిండియుఁబండులురాల్చు మెండుగన్॥

ఉ॥ తముత్రల గుంపునందలి రుగేముత్రలపెంపున శీతవాతపో
తమత్రల పంపున నత్రధుఘృతమత్రలగింపు ననంగునంపమొ
త్తముత్రల సొంపున స్వహుగతముత్రలముంపున నీదుహంసజా
తముత్రల తెంపునం బలుకతముత్రలనింపు నయించుఁ గొండ్కొలన్॥

సీ॥ జిగినాఁచుదీఁగలు చిగురుదర్భలుగాఁగ నలిననాళములింధనములుగాఁగ
ఫుల్లరక్తాంబుజంబులు నిప్పుకలుగాఁగ ఘనకేసరంబు లక్షతలుగాఁగ
మహుగసపూరంబుమధురాజ్యధారగా మధుకరరాజి ధూమంబుగాఁగఁ
దీరభూజములు బుత్విగ్జనంబులుగాఁగఁ దక్షగధ్వనులు మంత్రములుగాఁగఁ
దమిత్రమొగ్గలుబలుయూపదారువులుగ । మనత్రథాధ్వరిగావించుమాని నీజ
నాతిమానాశ్వమేధమహాధ్వరంపు । గొలవనుతలంపు వింపు నక్కొలనుసొం

క॥ క్రమమత్స్యకూర్మరేఖో । ద్గమసంకుల కంకణోరిత్రకాశ్రీకరమై
కమలాకరమోయనఁద । త్కమలాకరమొప్పు విమలకమలాకరమై॥

చ॥ భువనధురీణతాయుతనభోగణుకస్థితిద్యు కపిద్వళ
బ్దరివృతిసాధ్వపాకలనభాసిలి దృక్ప్రుతిభావభావ్యమై
మరిశదమై రసాతలము శోభిలఁజేయుచుఁ బద్మలోచనా
నవరతళయ్యనా నది యనంతవిలాసముఁ జూపు నెంతయున్॥ 85

సీ॥ సమ్యక్ప్రసాదవత్సరసభావంబున ఘనమధుపాటనాళిలవవలనఁ
బ్రబలగాంభీర్యధారంధర్యసంగతి రమణీయభువనసంభరణగరిమ
మత్స్యకూర్మాదిసంభవహేతుకస్థితిఁ గువలయవిలసనాతుంతమహిమ
సంతాపమునడంచుచల్లఁదనంబున నాశ్రితసులభమై యమృతమిమట
సౌత్యమువహించియును సుదంచితద్విశేష। శబ్దలక్ష్మీత్రిదృదమితాబ్దసముదయాస్ప
దత్వగౌరవమున మీఱుదానవారి। మానసము నేమనఁగవచ్చు దానిసొబగు॥ 86

చ॥ అరుణకరోత్కరారుణ కుమాంచల చంచల చంచరీక సం
చరణసమంచితామ్రతరు సంచయముల్ జలబింబితంబులై
పరఁగుఁదదీయతీరమున వహ్నికిఁగంటి ముపర్యధోముఖ
స్ఫురణము నేఁటికిందనుచుఁ జూపరులబ్బురమందిచూడఁగన్॥ 87

ఉ॥ మీఁదుగఁబాదముల్ వఱపి మేదిని నాదలలూఁచి మాధవై
కోదయ సాదరాత్మక వసోదరమందు జపించువారిగా
వాదరిసున్నయున్నతనురాగములం గమలాకరప్రస
న్నోదకమందుఁజూచి చెలియొక్కతె మ్రొక్కఁగ నవ్వెరందఱున్॥ 88

జలక్రీడాదిప్రశంస.

శా॥ రాసక్రీడలఁ జేడెలందనిపి యా రాజీవనేత్రుండు పే
రాసన్ వారివిహారముల్ సలిపి విర్యచ్చంద్రికాసాంద్రధా
రాసంపాతసుశీతసైకతములన్ రాజాస్యలంగూడి యా
రాసంభోగమొనర్చె నష్టలిరుఁడై ప్రత్యేకరూపంబులన్॥ 89

గోపీసంశయవిచ్ఛేదము.

సీ॥ తత్త్వజ్ఞలక్షలితబ్రహ్మచారిగా విచ్చకంబాడుదు రింతకాని
యిందతిలోఁగృష్ణుఁడిట్లురమింపుచు నష్టలిఱుండెట్టుకానటంచు
నగుమగుముకెల్ల నమిత్రకపుట్టుట కొకదేయిమదాప్యాచుఁదుగ్రుఁడగుచు
నాకొంటివన్నముల్ దేమన్నకపియిగచునని యమునాపారమందు మొఱయ
యమునదాఁటి రాఁగ నసమర్థలై వారు। పన్నినట్లచేసి యన్నములిడి
కృష్ణుఁడష్టలిఱుఁదు బుషిశశ్వదుపవాసి। యనుచునమిత్రవేఁదుకొనిరివారి॥ 90

## గంధర్వ శాపవిమోచనము.

మ॥ నగముచ్చాంగిరసుల్ గురూపులని గంధర్వుండు వారల్ శపిం
పఁగఁ బామై యిటనందు ద్రింగ హరియొంపఁ ద్రొంటి రూపంబుతో
గగనంబంటి సుదర్శనుండను భవత్కారుణ్య సంపత్తిచేఁ
దెగె మచ్ఛాపమటంచు మ్రొక్కిచనియెన్ దేదీప్యమానాకృతిన్ । 91

## శంఖచూడచూడామణి హరణము.

కొనకొని శంఖచూడుఁడను గుహ్యకుఁ డొక్కవిలాసవేళ న
ల్లనచని వల్లవీజనములం గొని పాఱఁగ శౌరి సీరితో
వెనుచని చీరి వారి విడిపించుచు వానివధించి తన్మణిం
గొని చనుదెంచి యిచ్చెనిట గోపికలం గని కాచుసీరికిన్ । 92

## కపిద్ధాసుర (కాలకవికుల) సంహారము.

సీ॥ బలియున్నయగు కాలకవియాసురక్కసి వెక్కసముగ నిక్కి వెలఁగయగుచు
వెలిఁగె నబ్బలియుని బలగముకంటకతరువులై పెరిగె నాతనిసహస్ర
సుతవతులగు సప్తసుతులు గోమూర్తులై ఘటతుల్య తత్ఫలచ్ఛటలఁ దినుచు
బలిసిరిందఱును దత్ఫలవిషవాతంబు లాభీర గోనివహార్తిఁ జేయ
శంభుఁ గొల్చి తత్ప్రేషితశంఖకర్ణ । భూతపరవశ విధివాక్యముల నెఱింగి
సీరితో శౌరిచని వారిఁ జీల్చి కాల్చి । మనిచె గోగోపకుల నిరామయులఁ జేసి ॥ 93

## వృషభాసుర సంహారము.

మ॥ వృషభంబౌచు నరిష్టనేమియను దైత్యేంద్రుండు దీండ్రించి గో
వృషముల్ గొందలమంద మందపయిఁ బర్వెం బర్వఁ బర్వెందుఁడు
నిశితధ్వాంతమునట్లసంచె నవుడానీరజనేత్రుండు త
ద్వృషమాకార విషాణమూడ్చి యదియే దివ్యాస్త్రమై తోడ్పడన్ । 94

## కేశి సంహారము.

క॥ శైశవమునఁ గేశవుఁడ । క్లేశంబున నీసడించి కేశియు నాదు నా
కేశవిరోధినదఁచిలో । కేశవినుతిఁ గాంచె వశమయిరి శిశువులకున్ ॥ 95

## కేశి ప్రలంబ వత్స బకాసురుల పూర్వవృత్తాంతము.

సీ॥ గంధమాదనమున గంధవాహాఖ్య గంధర్వతపస్వికి నందనులయి
తగు సుదర్శన సుహోత్ర సుదేవులును సుపార్శ్వుఁడును దుర్వాస శిష్యులయి
యోగబలమున రాధేశపార్శ్వతులై పదత్రిపూజనిత్య వ్రతంబుగఁ దదర్థ
ముమకొలనికిఁ బోయి కమలముల్ గోయుచు శివసృష్టులైతమ చెయ్యిఁ దెల్పఁ
దత్రసరసికి మున్నున్న శివునియాన । దప్పదని కృష్ణుఁడై వారితలఁపుఁ దీర్చ
శివుఁడు విడువంగవారకేశి ప్రలంబ । వత్సబక దైత్యులై ముక్తిఁ బడసిరపుడు ॥ 96

## వ్యోమాసుర సంహారము.

మ॥ ఇటులశ్వంబగు కేశిఁ ద్రుంచి యటుపైఁ గృష్ణుండు గోపాలితో
నటవిండ్రాఁగిలిమూఁతలాడు నెడ వ్యోమాఖ్యాసురుండర్భకుం
డటులై యాటమిషన్ గభీరగుహలో నాభీరులన్ దాచ న
క్కుటిలుం ద్రుంచి గుహాగతార్భకుల దోడ్తోఁ గాంచుఁ బెన్ మందకున్ ॥ 97

## మాతులాహ్వానము.

సీ॥ వినుఁడు నారదుఁడు కంసునకుఁ గృష్ణప్రశంసయును గృష్ణునకుఁ గంస ప్రశంస
యును దెల్పవినికంసుఁ డుగ్రుఁడై వసుదేవు వఱకరా వారించె నారదుండు
పిమ్మట నక్రూరుఁ బిలిచి పిమ్మటలచందము లెల్లఁ జెల్పి బృందావనమున
కిప్పుడనీ వేగి యప్పనంబులఁ గొని రామకృష్ణుల ధనుర్యాగమునకుఁ
దోడుకొనిరమ్మ తన నతండు గూడదనుచు। నెంత చెప్పిన వినకున్న నీశ్వరాజ్ఞఁ
ద్రోయరాదని యొత్తిగి యక్రూరుఁ డరిగి। రమ్మనఁ గఁ బోయి రాచరిత్రముల వినుఁడు

## దివ్యరూప పరివర్ణనము.

మ॥ యమునం దాఁటి రథాధిరూఢులయి వారక్రూరు నీక్షింపఁ దో
యమునం ద్రుంగుచు నీటఁ బైటనొక ఛాయం గాంచె శ్రీకృష్ణ కా
యమునంతన్ భ్రమదీరమున్గి యతఁడొయ్యం బావరాశయ్యనా
య్యమునన్ వర్తిలు మూర్తిఁ గన్గొను వెరంగై మ్రొక్కి ధ్యానింపుచున్ ॥ 99

సీ॥ మలనూని విలువోవి నలుపూని చెలువారు పులిగోరు తీరు కన్బొమలవాని
తొలిగుండు తలనుండు వలనిండు నెలమించుఁ గికురించు తెలిబోమిడికమువాని
కటిదాల సరిగ్రాలు నెటిచాలు నెటిచాలు గదిరేదు ముదురైన నుదురువాని
కొలగాని మెఱుఁగాని నెత్తిరూవికంబుల వందమా హెచ్చుంబొబ్బబందువాని
తెలివలుమాకోని మానికంబుల జగాని। గారమొగిఁ గేరి జగిదేరి మీఱునొసల
వడమవిడి నివ్వటిల్లు మవ్వంపు దివ్య। చొక్కమొకచక్కఁ జేర్చుచేర్చుక్కవాని ॥ 100

## దివ్యరూప వర్ణనము.

సీ॥ అంగదప్రాంగదలంగదలంకించు చాలఁ గదముల నొసంగువాని
మురిపెంపు సిరిపెంపు నరహింపు రతినంపు పేరు పేటురమున మీఱువాని
యురుగుల్ తొలుంగుటుంగరములుం గరములం గరమలంకృతులు గాఁ గలుఁగువానిఁ
జెను మించులను మించు పికిలిపించెపుఁ గుచ్చు వ్రేలాగు మొలద్రాడు వెలయువాని
తళుకుమగడాలుఁ దొగడాలుఁ దమ్మిడాలుఁ। బుగ్గదొరడాలుఁ గలడాలుఁ బ్రొద్దు
[డాలుఁ
దారొరల డాలు నెలడాలుఁ దలువుడాలుఁ గలుఁగు మేల్కొందనపుటంచెల
[illegible] ॥ 101

సీ॥ అలసంపఁగుల జొంపముల పెంపడలనొంపఁగల సొంపుగల నాసఁ గలుఁగువానిఁ
గురువిందములఁ గెంపుటరవిందములఁ జెంపుఁదొలఁగించు మోవినవ్వొలయువానిఁ
గ్రమవృత్తసమచిత్తజమహత్తరనిషంగకమనీయ జంఘాయుగంబువాని
వెలిదమ్ముల మదముత్తె వెలిజిమ్ము చెలువమ్ము గలనిడువాలుఁగన్నొమలవాని
నిడుభుజంబులవాని సుందొడలవాని । నొగులడఁచువాని గూఢజానువులవాని
తేలిడెడువానిచక్కని మేనువాని । శ్రీరమాజానినపుడు దర్శించిరచ్చి॥ 102

చ॥ నునువిను చాలిమేఁత పయినూలొక్కని నిబ్బెపులిబ్బి బ్రబ్బుబో
టి పెరుఁగుమేలితొట్టూరపు కడెందియనుంగున గొప్పనొప్పఁ జా
లినకొనగోటఁ జిక్కవెడలింపుచునింపుగఁ బాలవెల్లియం
దు పెగడు దున్న నిన్నుఁదలఁతుఁ మురమర్దన శ్రీజనార్దనా॥ 103

ఉ॥ ఈనదిలో మునింగి భవదీక్షణతృప్తుఁడనై భజించితిన్
మానసికార్చనార్పితసుమంబులె నీపయినుంటఁగంటి ని
క్లైనిపుడీ వెఱుంగనటు లేమిగనంబడెనీట నంటినో
దీనశరణ్య కృష్ణ భవదీయమహత్త్వ మెఱుంగ శక్యమే॥ 104

శా॥ దేవా కృష్ణుఁడు వాసుదేవుఁడని మూర్తిస్ఫూర్తి వీక్షించి యీ
జీవుల్ గొల్లదచంద్రుగాని నిజమీక్షింపన్ జగత్కుక్షివే
కావే కావవె భావవేశ్రమున నీకల్యాణరూపంబు స
ర్వావస్థావసరంబులన్నిలిపి మాయంబాయఁగాఁ జేయవే॥ 105

## అపూర్వ స్తవము.

స్రగ్ధర శ్రీకంఠుండై సేవ్యుం డంచుం జెప్పన్ వేదశ్రేణుల్ దొల్తన్
వైకుంఠుండై వంద్యుండంచుం వాదించుం దర్వాతన్ దామే
యేకాకారంబై బ్రహ్మంబై నీమూర్తుల్ దానేయానంచున్
నాకుందోఁచున్ నామాకారానందార్థం బీనాయ్యంబౌటన్॥ 106

సీ॥ అనుదినమును నినుమనమునఁ గనుఁగొను మనుజుని వెనుకొని మనుతుననుచు
వినుపెడఁ గనుపెడఁ జనుపెడఁ దినుపెడ నవుపెడ ననువిడ కెవరును ననుచుఁ
దెలిసియుఁ దెలియక సలిపిన కలుషము లయుతములయినను నేయిపుమనుచుఁ
బనుల కొలఁది పలుతనువులనొసఁగిన నలయక తలఁపున మెలఁగుమనుచు
బహుళసుఖముల నిహమునఁ బరమపదము చరమగతినిదుమని నినుగరిమఁ గొలుతుఁ
గరముఁ గనికరమున మదిగరుగ నభయకరము శిరమున నిడుమిక పరమపురుష॥ 107

ల॥ ఇలయును జలమనలమును చలి పెలపుగగనమును గలసకలజగములను దలఁపున నె సల్పన్
నిలుపఁబురికొలుపఁ దరిఁ గలపమతియుతరులకుఁ బలుమఱును గనఁబడక ఫలముల
[నొసంగన్॥
బలుపగలయవతరణములనవనిఁ గనఁబడియు ఎల్లఁ దెలియఁ బడతిమహిమలను జెలు
[వొందన్॥

దోలుబ్బులకుకోవఁగన సులభముగఁగనఁబడఁగ వలతివయి వెలయునిమ్మఁగొలుతుఁ [బరమాత్మా॥ 108

ల॥ జననియును జనకుఁడును తనయులును సహజులును ధనము పరిజనము గురుజనము [మఱిసీవే
యను మమతఁగను మునిమతి ఘనుచునను మతముచుమని విన్నయమున నయమునను మనవి [యొనరింతున్
వినతులయి వినుతులను ననుఁదనుపుననదలను మనుతునను దినమునెదు ఘనమగు [ప్రతిజ్ఞన్
గనికరముగనికరము మనమునను బెనఁగొనఁగఁ గనుఁగొనుమునఁగొనుము వినుము [పరమాత్మా॥ 109

ల॥ సురపతియుశుచియముఁడు నిర్ఋతియును వరుణుఁడును గరువలియుఁ ధనదుఁడును [హరుఁడును మొదల్గాఁ
బరఁగుసురవరులయినఁ గరముధవదఖిలగుణ గరిమలవమయినఁ దెలి యరవిశ్రుతి [వల్కన్
గరయుదరథరణమొకపరమగతి యనుచు ధవశరధిఁబడిమునుఁగుచును దరిగనక నానా
దురితములనిరతమును జరితములఁగనఁబడెదు నరులకది దెలియుటకుఁ [దరమె పరమాత్మా॥ 110

ఉ॥ అండజయాన కుండలిశయాన భయానకభండనారి రా
క్షండన యక్షరకాండ నవకౌస్తుభమండన రక్షితాశ్రితా
ఖండల గండలంబిశశిఖండ లసన్మణికుండలా ప్రస
న్నాండవృగముత్త చక్రధర నూత్నవిభాస్త రవీందుతుండలా॥ 111

ఉ॥ తావకసేవ తావళికిఁదద్దయు నెద్దియునైన భావుకా
భావముగల్గునే వివిధభావములంగన నీదుపాదరా
జీవములాశ్రయించె నిజచిత్తము గావున నిబ్బయంబు నే
నే విదళించి కావఁగదవే యవినశ్వర భార్గవీశ్వరా॥ 112

క॥ అని యీగతివినతుండై। వినుతింపుచు మధురఁజేరి వెన్నునిఁదనతోఁ
దనయింటికిప్పుడేవ। మనసుఁగంసుని మొత్తి వత్తుమని పుత్తెంచెన్॥ 113

## రజక సంహారము.

ఉ॥ అంతదినాంతమయ్యె నరకాంతకుఁడుం బురకాంతలెంతయున్
వింతగఁజూడ ధీసంతసిల విప్రులు మెచ్చఁ బురాంగన
ప్రాంత నెవద్దుచున్ రజకుఁబుట్టములిమ్మన నీమి నా మిమన్
గొంటుకనాక్షి శ్రోక్షి తమకుందగుబట్టలు గట్టెదైకాదెన్॥ 114

## కువింద రక్షణము.

క॥ మంతలగారుదుడై మావ్యక్తుని విందుఁడు మాపిలిక తారవిందుఁడగుడు గో
విందునకు మేనివలువలుఁ। గుందనపుందొడవులిచ్చి కొనె నీప్సితముల్॥ 115

## వాసుదేవ ప్రభావప్రశంస.

చ॥ హరిగిరిమం బెఱుంగఁ దరమా పరమాత్ముఁ డతండు నేఁడు భూ
భరము హరింపఁ గృష్ణుఁడయి భక్తులఁ బ్రోచుచుఁ బాపయుక్తులం
బొరిఁగొను మిన్నవాఁడు వెలుపుల్ మఱుపుల్ గలవాఁడు గాదు భం
గురమతు లెట్టులన్న ముచికుందరిరక్షణ వర్ణనీక్రియన్॥ 134

## ముచికుందచరిత్రము.

సీ॥ ముచికుందుని చరిత్రము వినుఁ డతండు మాంధాతృపుత్త్రుఁడు దేవతాహితార్థి
వాసవప్రార్థితుండై సమరములందు నమరులకు జయంబు నమరఁ జేసి
సురలు ప్రసన్నులై వరమీఁ దలఁచినఁ దనవాంఛ లేమి నిద్రను వరించి
లేపినవానిఁ గూల్చెద నంచుఁ బన్నుంట హరి యెఱుంగును గాన తనని పుడు
మేలుకొల్పుటకిరీతిఁ గీలుకొల్పి । స్వాజ్ఞ చే విశ్వకర్త మున్నద్భుతమ్ము
మున సృజించిన ద్వారకాపురికిఁ జేర్చె । యోగమహిమను మధురలో నున్న జనుల॥

క॥ వీక్షించుచు ముచికుందుఁడు । పేక్షింపక మోక్షమున పేక్షింపఁ గృపన్
రక్షింపనున్న జలజా । క్షునిటుల్ పొగడఁ దొడఁగె నతఁ డానతుఁడై॥ 136

## ముచికుందస్తవము. బాలకృష్ణస్తవము.

శా॥ శ్రీనందప్రియనందనుండవగుచున్ ద్రేపల్లెలోఁ బుట్టి నీ
వానందప్రదమూర్తివై తిరిఁగి నీయాకారమే కారణం
బైన న్మాత్రము జేసి కన్పఱచి నన్నానంద మొందింపుమీ
నానామంగళ సంఘసంఘటన కృష్ణా బాలకృష్ణా హరీ॥ 137

శా॥ నేనీవాఁడనటంటి నేఁడుకొనుచుంటిం బ్రోవుచుంటిం గృపన్
నా నేరంబులు సైచుచుంటి భవసంతానంబు నే నోర్వఁగా
లేనంటిన్ నినువంటి వేల్పెవరున్ లేరంటి రక్షింపుమీ
నానామంగళ సంఘసంఘటన కృష్ణా బాలకృష్ణా హరీ॥ 138

శా॥ నేనే కార్యముఁ జేయుచున్న నది నీనిర్వర్తిగాఁ జూచి నా
దీనత్వంబెడఁ బ్రోది కేవల కృపాదేదీప్యమానుండవై
నానందింపఁగనీక యేమరక నిత్యానంద మొందింపుమీ
నానామంగళ సంఘసంఘటన కృష్ణా బాలకృష్ణా హరీ॥ 139

శా॥ జ్ఞానంబించుక యైన లేనికతనన్ సంసారసౌఖ్యంబులన్
మానంజాలఁగ నైతి పట్టులయినన్ మత్పూర్వపుణ్యంబునన్
నీనామస్మరణంబు గల్గెనిఁక దానన్ నిల్పి రక్షింపుమీ
నానామంగళ సంఘసంఘటన కృష్ణా బాలకృష్ణా హరీ॥ 140

శా॥ నీ నాభీకమలంబునం బొడమి వాణీభర్త నీతత్త్వమిం
తైనం గన్గొనఁజాలఁడయ్యె నరసంగా నస్మాదృశాత్యంతమూ
ఢానీకంబు గనుంగొనంగలదె ప్రత్యక్షంబవై యేలుమీ
నానామంగళసంఘసంఘటనతృష్ణా బాలకృష్ణా హరీ॥ 141

శా॥ సూనుం డెంతటి నేరపోతయిన సంక్షోభంబు లేకుండుచుం
దానం దండ్రి సహించి ప్రోచుకరణిన్ నానేరముల్ సైచి నీ
యానం బ్రీతి ప్రియొసంగు మైహికసుఖం బాముష్మికానందమున్
నానామంగళసంఘసంఘటనతృష్ణా బాలకృష్ణా హరీ॥ 142

శా॥ విశ్వంబంతయు నీవుగాఁగనుచు శ్రీవిష్ణున్ను సేవించువా
రైశ్వర్యం బిహమందునొంది పరమందైక్యంబుఁ బ్రాపింతుర
న్విశ్వాసంబునఁ దత్ఫలార్థినగుచు న్నిన్గొల్చుచుంటిం జుమీ
శశ్వన్మంగళసంఘసంఘటనతృష్ణా బాలకృష్ణా హరీ॥ 143

శా॥ అక్షుల్నిన్గనునట్లు హస్తములు నిన్నర్చించునట్లాత్మ ని
న్నక్షీణంబుగ నమ్మునట్లు చెవి నిన్నాలించునట్లాస్యమున్
వీకున్ నిన్గొనియాడునట్లు కరుణన్వీక్షించి రక్షింపుమీ
సాక్షాన్మంగళసంఘసంఘటనతృష్ణా బాలకృష్ణా హరీ॥ 144

మ॥ సుగతిం గోరుదుఁ గాని యేసుకృతమెచ్చోటైనఁ జేయంగ నై
తి గజేంద్రస్థితి వంటి నిన్గొలుచుచుంటిం బారతంత్ర్యంబుచే
త గుణేందప్పించరించుచుంటి నయినం దాసుండనైతిం జుమీ
జగతీమంగళసంఘసంఘటనతృష్ణా బాలకృష్ణా హరీ॥ 145

మ॥ మును నీసన్నిధిఁ దక్కఁ దక్కినఫలంబుల్ పుట్టుచుంగిట్టుచుం
గనుఁగొంటిం గనుఁగొంచునుంటి నిటపైఁ గారుణ్యమే పారఁగా
నను నీసన్నిధిఁ జేర్చుకొమ్మి దెసుమీ నాప్రార్థనీయంబు స
జ్జనతామంగళసంఘసంఘటనతృష్ణా బాలకృష్ణా హరీ॥ 146

క॥ చనువున నింతియనాకో । రిన యది నీవింతమాత్ర గృపసేయఁగదే
వినతాశ్రితవనచైత్రా । వినతాసుతపత్ర వేదవినుతచరిత్రా॥ 147

క॥ అని యీగతి వినయాగతిఁ । దనరారఁగ భక్తియుక్తితత్పరుఁడగుచున్
వనజాక్షుని వినుతించిన । జనితానందమున సుప్రసన్నుండగుచున్॥ 148

## ముచికుంద వరప్రదానాదిప్రశంస.

ఉ॥ కోరి ముకుందుఁడట్లు ముచికుందునకున్ వరమిచ్చి వచ్చి కాం

తారములీలఁగాలయవనప్లుతవం జతనంబులేక దా
సీరియు నేకమై తునిమి శ్రీమథురా ధనధాన్యసంపదల్
వారక ద్వారకాపురికిఁ బంప జనుల్గొనిపోవుచుండఁగాన్॥ 149

## శ్రీద్వారకాపుర ప్రవేశము-

సీ॥ అంత జరాసంధుఁడంతక నిభసైన్యములతోడ మథురను ముట్టడించి
రామకృష్ణులు ప్రవర్షణగిరిశిఖరంబునకుఁ బోవుటరసి వెక్కదళివారి
మతమెఱుంగక భయంపడిమఱుపడిరని భ్రమసివారిదహించువాఁడు బోలె
నగ్గిరి డగ్గరి యగ్గి రవుల్గాల్చి ప్రుగ్గిరి వారని మరలి పోయెఁ
బదునొకండామడలపొడవెత్తఁగియున్న । యున్నతగ్రావశిఖరంబునుండి హరియు
హలియునింతకుమున్నె సైన్యములవెలికి। దాఁటిద్వారకఁజేరి రత్యద్భుతముగ॥

## శ్రీమథురాక్షేత్ర మాహాత్మ్యము-

శా॥ శ్రీకృష్ణాభ్యుదయంబునన్ మథురయే క్షేత్రోత్తమంబౌచు నా
రా కాశ్యాదులకన్న జన్మమరణ బ్రహ్మోపదేశాంగదా
హాకార క్రియలం జతుర్విధముగా నైక్యప్రదంబౌచు ను
ద్రేకించెన్ మహిమంబునన్ జతురశీతిక్రోశమధ్యంబునన్॥ 151

## శ్రీద్వారకాపుర వర్ణము-

శా॥ మున్నింద్రాదిపురంబులెల్లఁ దనకూర్పున్నేర్పు రాజిల్ల నో
జన్నిర్మించిన విశ్వకర్మ హరియాజ్ఞం బేర్మి నిర్మించె న
మ్మన్నీ రంతరమిచ్చె లక్ష్మికదియే పుట్టిల్లునట్టిల్లుఁ బెం
పెన్నన్ ద్వాదశయోజనంబులు తరంబె ద్వారకం బేర్కొనన్। 152

సీ॥ అకలంకనిత్యపూర్ణకలావిరాజిత ద్విజరాజరాజిప్రదీపితంబు
సంతతక్రతువృద్ధిసంపాదనానుగ్రరాజావతంస విరాజితంబు
మిత్రసంప్రీణనస్తోత్రపాత్ర నిధీశపుణ్యజనార్యవిస్ఫూర్జితంబు
సఫలహలక్రియా సంపూర్ణబలభద్రశూద్రవర్ణబలాభిశోభితంబు
విబుధకులవృద్ధి శైత్యవర్ధి శుభస। మృద్ధి పుణ్యాభివృద్ధి జడేతరర్ధి
శుద్ధి ధనవృద్ధి బహుముఖసిద్ధి విజిత। సురవరపురంబు ద్వారకాపురవరంబు॥

చ॥ లలనలు తత్పురీ దయితులం దమిఁగౌఁగిటఁజేర్చి చంద్రశా
లల నలువొందు మాటా రతివిలాసి జయించుటకేఁగి వారి లీ
లల నలలోచనప్రతిఁ జెలంగఁగనుంగొని భీతినిండ్లగో

లలనలు దిక్కులన్ విడుచు లక్షణముం దెలుపన్ వెడల్విరుల్ । 154

చ॥ తనరు హరిన్నభంబులను ద్వార వితానములొంది చిల్వతేఁ
డను నెలతాల కంబమున నందము నొంచుచునున్న భూతలం
బనియొదు మేడలో నిడిన యాతత దర్పణదీపయంత్రమో
యన ఘన భర్మహర్మ్యసహితాచ్ఛమణీకృతవప్రమప్పురిన్ । 155

చ॥ తరమె నుతింపఁ గ్లౌమణివితాన వితాన తతానపాయముం
దిరరుచి కౌముదీ ముదిత దివ్యచకోర ముదశ్రుపూర సా
గర సురదీర్ఘికా వలన ఖండితపత్త్రిసరోరుహస్థ బం
భర పణిభోగశాయి హరి పశ్యదశేషసురిన్ మహాపురిన్ । 156

మ॥ పురమాశాంతరవర్తికీర్తికలశాంభోరాశిరాడంతర
స్ఫురదత్యున్నతవప్రశృంగదళవిస్ఫూర్జత్సుపర్ణోపలో
త్కరబద్ధాలయకాంతిరేణువిలసత్పద్మాక్షభృంగోజ్జ్వల
ద్ధరిపుర్గాంబుజనాళలీలఁ దగు నుద్యత్కేతనం బప్పురిన్ । 157

క॥ ఆపుర మున్నతగోపుర । మై పరఁగి పయోరుహాసనాండోర్ధ్వపుటం
బేపున భేదించియ కా । దే పుటభేదనసమాఖ్యఁ దెచ్చెఁ బురులకున్ । 158

మ॥ వినతానందన విశ్రుతిం దనరుచున్ వేదాత్మకత్వంబుమున్
గనుటన్ వ్యాకరణప్రవీణత ననంతఖ్యాతిసంపత్తిచే
మనుటన్ ముప్పదిరెండునాఁ దనరుసమ్యగ్బ్రహ్మవిద్యల్ గనుం
గొనుటన్ నామము సార్థకంబగుచు వెల్గుం దద్విజశ్రేణికిన్ । 159

మ॥ నరమాత్రుల్సొరరానిచోటవలనన్ నానాప్సరోయక్ష కి
న్నర విద్యాధర సిద్ధకింపురుష గంధర్వాదులయ్యైపనుల్
పురిఁ గావించి గడించుచున్న విభవంపుం బెంపు నీక్షించుచున్
హరికర్పింపని నాటికల్మిగని యక్షాధ్యక్షుఁ డొందుం ద్రపన్ ॥ 160

శా॥ అన్నాళీకదళాక్షుఁ డన్నిటికి నధ్యక్షుండునుం గారణం
బిన్నానావిధ విష్టప ప్రతతి తత్సృష్టంబు తత్పుష్టముం
దన్నిష్టంబును దద్వినష్టమగుఁ గ్రీడామాత్రమాప్రోడకే
తన్నిర్మాణభృతి ప్రభృత్యఖిల కృత్యం బెన్న నత్యంతమున్ । 161

ఇంద్రాద్యమరసమర్పిత తత్తద్వైభవ ప్రశంస-

సీ॥ పారిజాతంబుతోఁ బరమాద్భుతంబగు తగుసుధర్మను బురందరుఁ డొసంగె

శ్రవణైకదేశమేచకమనోజవశుక్లవర్ణతురంగముల్వరుణుఁడొసఁగె
వరనామకంబైనవరనిధినాక్రోటి దక్కఁదక్కిన నిధుల్ధనదుఁడొసఁగెఁ
దక్షిణదిక్పతుల్దమకుమున్నీశ్వరుండిచ్చిన సంపదలెల్లనొసఁగి
రిట్టిసంపదలకునెల్లఁబుట్టినిల్లు। నైపరఁగుద్వారకాపురి నధివసించి
హలధరుఁడు రేవతిం బెండ్లియాడెఁ గృష్ణుఁ। డష్టమహిషులఁ బెండ్లాడెనద్భుతముగ॥

## రేవతీ పరిణయము-

సీ॥ కృతయుగమందు రైవతుఁడను రాజు రేవతియనఁదగుతనసుతకుఁ బెండ్లి
సేయఁదలంచియేతెంచిపతినొల్లక కన్యతో సత్యలోకమునకరుగ
నృపుతలంపువిరించిరోఁటెఁగి యిర్వదియెన్మిదిమహాయుగములుగతించె ద్వాప
రయుగాంతమిపుడయ్యెరాముఁడు కృష్ణాగ్రజుఁడు గాన వర్యుఁడీసుతనొసంగు
మనఁగనాతఁడు ద్వారకకరిగియొరగి। తనతలంపునువ్యాపంపు నెఱిఁగింప
లాంగలంబునఁ గ్రిందికిలాగికుఱుచఁ। జేసి రేవతిఁ బెండ్లాడె సీరధరుఁడు॥

## అష్టమహిషీకల్యాణ ప్రశంస.

## ౧- శ్రీరుక్మిణీ కల్యాణము.

సీ॥ శ్రీశాద్భృతి విదర్భదేశాధిపతిభీష్మకుండు కుండినపురి నుండునాత
నికి రమాంశమునజనించిన రుక్మిణియందుఁగృష్ణుఁడుఁ గృష్ణునందురుక్మి
ణియుఁబరస్పరమోహానిర్మగ్నులౌచుండరుక్మిణినన్నయా రుక్మిపూని
శిశుపాలునకొసంగసిద్ధమైయుండుట ద్విజునంపిరుక్మిణిదెల్పకృష్ణుఁ
డరిగిపురశక్తిఁగనఁబోవుటరసియామె। నరదమెక్కించుకొనిపోవ నడ్డుపడినఁ
దలగొఱిగిరుక్మినడలించితరలివచ్చి। యిట్టరుక్మిణిఁబెండ్లాడెఁగృష్ణమూర్తి॥

## ద్రౌపదీ స్వయంవర ప్రశంస-

సీ॥ ద్విజవేషమున ద్రౌపదీస్వయంవరరంగమునఁ బొల్చుపాండునందనులఁబోల్చి
శౌరి సీరికిఁజూపి జయమొందు నేఁడిందు విజయుండనుచుఁ దెల్పిస్వజనములను
గదలకుండఁగనిల్పికనుచుండఁ దమకసాధ్యంబైనయంత్రమత్స్యంబు నేసి
యాజ్ఞసేని వరింప నరుగు నరుం గని యెదిరించి యోడిర య్యనసుతాదు
లంతపైఁగొంతికొడుకులయంతికమున। కరిగి లాక్షాగృహవిముక్తులైనమిమ్ముఁ
గంటిమిదిపుణ్యదినము మేల్లగ్గు మీకటంచు పీడ్కొనివచ్చిరిహరియుహలియు॥

## ౨- జాంబవతీ పరిగ్రహణము-

సీ॥ రవి నిత్యమష్టభారసువర్ణమిడు శమంతకము సత్రాజిత్తునకునొసంగెఁ

తదనుజుండు ప్రసేనుఁ డది దాల్చి వేఁటకుఁ జన వాని సింగంబు దునిమి దానిఁ
గొనె దానిఁ దునుమాడి కొనె జాంబవంతుఁ డీకృత్య మెల్లను దన దేయటన్న
నింద చతుర్థి నాఁ డిందునిఁ దాఁ గన్న ఫలమని కృష్ణుండు దలఁచి వెలుచ
నడుగుజాడను గుహఁ జొచ్చి యచట జాంబవంతుతోఁ బోరి యాతని వరమువీర్చి
మణిని జాంబవతిం గొని మరలి వచ్చి । మణి నతని కిచ్చి తన నింద మాన్పుకొనియె॥

క॥ వాపోపఁడఁ జూపోపని । పాపోప నిబద్ధులకట పటుకటుచటుల
వ్యాపారం బేపారఁగ । లాపనలం బన్ను చుం బ్రలాపించిరిగా॥ 167

## ౩. సాత్రాజితీ వివాహము.

సీ॥ హరిగోరినప్పుడీనైతి నూరక నింద మోపితి నతనిపైఁ బాపినైతి
ననుచుఁ బశ్చాత్తప్తుఁడగుచు సత్రాజిత్తు మణితోడ సత్యభామను సమర్ప
ణము చేయ హరియుఁ గన్యామణిఁ బెండ్లాడి మరల నాతనిక యమ్మణి నొసంగెఁ
దనకిచ్చెద నటన్న తనయ నన్యున కిచ్చెనని శతధన్వుఁ డాతని వధించి
మణిని గొనివచ్చి కృతవర్మ మరుఁగుఁ జొరఁగ । నతఁడు నిరసించె నక్రూరుఁ డట్లయనఁగ
నతనికడ నిడి చనుచుండ హరి వధించి । మణికి నక్రూరు రావించి మరల నొసఁగె

వ॥ అది యెట్లనిన.

సీ॥ ననునిల్పి శతధన్వుఁ దునిమి శమంతక మపహరించితివి లేదంటివడుగ
శపథముల్ శపథముల్ చాలుఁ జాలు నమ్మఁజాల నిన్ననిసీరి శౌరి వదలి
మిథిలలో మూఁడేండ్లు మెదలి దుర్యోధనునకుఁ దా గదా కదనంబుఁ గఱపె
సవనదీక్షాకవచ సురక్షితుండౌచుఁ గాశికాపురినుండెఁ గాందినేయుఁ
డపుడవగ్రహ శాంతికై యతని నితనిఁ । బిలిచి మణిఁ గొని కలుఁ బ్రావు హలధరుండు
నేచు స్త్రీలోలుఁడను నీవు నియమశాలి । యుందమని గాందినేయుని కే యొసంగె॥

## ౪. కాళిందీ కల్యాణము.

సీ॥ పాండుసూనులఁ జూడఁ బుండరీకాక్షుఁ డింద్రప్రస్థపురి కేగి తానునింద్ర
నందనుండును యమునాతటంబున వేఁటలాడుచు నాకకన్యనందుఁ గాంచి
తన్వరింపఁగ నీటఁ దన్వి తపించుట కాళిందియాదిత్యకన్యయగుట
విజయదౌత్యంబున విని సంతసిలి తదన్వితముగాఁ గొంచు విశ్వకర్మ
పేరి పురిఁ జిత్రతరముగా వింపఁ బంచి । ఖాండవముఁ గ్రాఁచు నెడఁ గాచి గాండివాదు
లగ్ని సభ మయుఁ డిడఁ గ్రీడి కబ్బఁ జేసి । ద్వారకకు వచ్చి యామె నుద్వాహమయ్యె।

## ౫. మిత్రవిందా పరిణయము.

సీ॥ అల నవంతిదేశాధీశులైన విందానువిందులు కౌరవాధిపత్య
ధీనులై కృష్ణుని మేనత్తయైన రాజాధిదేవికిఁ గడు ననుఁగుపట్టి
తమకుఁ జెల్లెలునయి తగు మిత్రవింద కుద్వాహంబనుచు స్వయంవరము సాటఁ
బనిచిన వినిచని వనరుహనయనుండు రారాజు మొదలైన రాజులరయ
నయన విజితారవింద దంతజితకుంద। చికురజితనీలకంద దృగ్జితమిళింద
మిత్రబృందావనానంద మిత్రవింద। నపుడు చేకొనె నృపులంద ఱలుకఁ జెంద॥

## ౬. నాగ్నజితీ పరిణయము.

సీ॥ నగ్నజిత్తని యొడు నామధేయమునఁ గోసలదేశమున కధీశ్వరుఁడు గలఁడు
నాగ్నజితి యనం దనర్చు నాతని కన్య యామెను రాజన్యులడుగఁ గాఁగ
సప్తగోవృషముల సమ్ముఖమ్మున నిల్పి వీనిఁ బట్టినవాని కీనాసంగు
వాఁడఁ గన్య ననంగ వశము గాకందఱు విముఖులై పోవుట విని చని హరి
సప్తరూపమ్ములై గోవృషములఁ బట్టి। గట్టిగాఁ గొట్టి యీడ్చి పొగడ్త కెక్కె
నాగ్నజితి నప్డు పెండ్లాడి నగరి కరిగె। నద్భుతముగ వచ్చి వివ్వచ్చుఁ డరులఁ దునుమ॥

## ౭. భద్రోద్వాహము.

సీ॥ సౌందర్య సౌశీల్య సౌభాగ్య సౌముఖ్యముఖ్య సద్గుణగణాద్భుతసముద్ర
బంధుమిత్రాతిథి పండితకవి భృత్యసాధువిద్యార్థిపోషణ వినిద్ర
పతితపాషండ దుర్వ్యాపార పిశునాదిహీనసంభాషణ మౌనముద్ర
భర్తృశుశ్రూషాది పరమధర్మాభ్యాసపాటవ తులితశుంభత్సుభద్ర
మందగమనవినిర్జితమహితభద్ర। పరమపావనచారిత్ర భద్ర భద్ర
మేనమఱఁదలు గావున మేరసెడక। కేకయుఁ డొసంగఁ బెండ్లాడెఁ గృష్ణుఁ డెలమి॥

## ౮. లక్షణా కల్యాణము.

సీ॥ మద్రాధిపతులకు సద్రాజధానియై పొలుపొందు శాకల్యపురమునందుఁ
దగు బృహత్సేనభూధవశిరోమణికిఁ దులస్యంశమునఁ బుట్టె లక్షణాఖ్య
నొక కన్య యామాన్య కుద్వాహమొనరింపఁ దొడఁగునప్పుడు నారదుండు వోయి
కృష్ణచర్యలు సంగ్రహించి తెల్పుచుఁ గృష్ణునికిఁ గన్యనిచ్చువానిగ నొనర్చి
కృష్ణుకడ కేగి లక్షణాకృతి నుతింపఁ। గృష్ణుఁడు స్వయంవరోదంత మెఱిఁగి యరిగి
యంత్రమత్స్యము నేసి కన్యను గ్రహించి। వైరులను గెంటి యింట నుద్వాహమయ్యె॥

క॥ కల్యాత్ముండష్టమహిషీ। కల్యాణకథాభరంబుకర్ణరసజ్ఞా
కుల్యల జాల్కొల్పుచుసా। కల్యమునంగాంచునిష్టకల్యాణములన్॥ 175

తీర్థస్నానాభిగమనము.

సీ॥ శౌరిశమంతపంచకతీర్థమునకు సాప్తముగసూర్యగ్రహణమునకరిగి
స్నానదానాదులుసలిపినపై యశోదానందపాండునందనముఖాప్త
జనులనువేర్వేఱ సముచితరీతిగా సల్లాపములనుల్లసిల్లఁజేసి
కుంతియువసుదేవుఁడెంతయుస్వప్రశంసనొనర్చికొనుటకుసంతసించి
కృష్ణుఁడును గృష్ణముఖులొకకెలననుండఁ। గృష్ణయునుగృష్ణసతులొకకెలననుండి
సరససల్లాపములొనర్చుసమయమందు। నిందతినిజూచి ద్రౌపదియిట్టులనియె॥
శా॥ రాకాచంద్రనిభాస్యలార కనులారంజూడకున్నన్ మనః
ప్రాకామ్యంబుఫలించునట్లు చెవులారన్ విందుసానందనై
మీకల్యాణచరిత్రఁ దెల్పుఁడనఁజెల్మిందెల్పి రాచెల్వలా
జొకన్ లక్షణదెల్పెఁ దెల్పితినటుల్ సూత్నప్రకారంబులన్॥ 177

నరకాసుర సంహారము.

సీ॥ నరకాసురుఁడుక్రొవ్విసురమాతృ కర్ణకుండలములువరుణుఛత్రంబుసురల
మణిపర్వతముహరింప నిలింపపతిదీనుఁడై విన్నవింపఁగా హరియు సత్య
భామతోరథమెక్కి ప్రాగ్జ్యోతిషముజేరిదుర్గసప్తకముఁదుత్తుమురుఁజేసి
మురునైదుశిరములుధరఁ గూల్చితత్సప్తనందనులవధించి నరకుఁద్రుంచి
వానిసుతుభగదత్తుసంపన్నుఁజేసి। ఛత్రకుండలమాలికాచిత్రరత్న
దాత్రియైధాత్రివేడఁ దద్వశగసశత। షోడశసహస్రకన్యలఁదోడితెచ్చె॥

సశతషోడశసహస్ర స్త్రీ ప్రశంస.

శా॥ అష్టావక్రుఁడు నీటనిల్చి సురకన్యానృత్తగీతాదులన్
హృష్టుండైహరిపత్నులౌనటు వరంబిచ్చెందనున్ నవ్వఁగా
రుష్టాత్ముండయిముక్తిలేక శబరుల్ రోధింపమీవిష్టపం
బిష్టప్రక్రియఁ జేరువారనియె వారే వీరునిక్కంబుగాన్॥ 179
క॥ మురపాశపరివృతం। బాశరగిరిశస్త్రాగ్నివాయుజలదుర్గంబై
కరమరుదగుప్రాగ్జ్యోతిష। పురకొమరులుజయింపఁగలరె భువిహరిదక్కన్॥

పారిజాతాపహరణము.

క॥ కుండలములుదితికిచ్చెన్। మండలము లభించినట్లు మాతయుమెచ్చెన్

భండనమునఁ బురివిచ్చెన్। హిండనమునఁ బారిజాతమింటికిఁ దెచ్చెన్॥ 181
శా॥ పౌలోమీరిత రీతిఁగా నదితికిన్ భక్తిప్రయుక్తాంకము
ల్పైలోమీటఁగ సత్యభామ వినతుల్గావించి సేవించు పెం
పాలోమీటిన వేడ్కఁ జేఁ గనుచు నిత్యాగణ్యతారుణ్యమున్
మీలో మీ రనురక్తినొందుఁడనుచున్ దీవించె దేవాంబయున్॥ 182
మ॥ హరికే చెల్లెనుగాక పాకరిపు నుద్యానంబుఁ గాల్పింపఁగాఁ
బరమెవ్వారికిఁ బారిజాతముల కీథస్యందుగా కన్యులె
వ్వరు దేఁజాలిరి కేలికేలములఁ ద్రావన్ గోపులం బ్రోవ భూ
ధరమెత్తం గరినాత్త మత్తులను మొత్తన్ గొల్లకుం జెల్లునే॥ 183

సాత్రాజితీ గౌరవాభివర్ణనము.

మ॥ క్షితి ప్రార్థింపఁ దదర్థమై యవతరించెన్ గృష్ణుఁడై విష్ణుఁడా
క్షితి సాత్రాజితిరూపమూని జనియించెం గాన సర్వోన్నతా
దృతి పాత్రంబయి సత్యభామదనరాచెం గాని చోఁ బారిజా
త తరుప్రాపణమే నిదర్శనము సౌందర్యాదు లట్లుండఁగా॥ 184

శ్రీ రుక్మిణీప్రణయకలహ నివారణము.

శా॥ ఓహో రుక్మిణి లక్ష్మియయ్యుఁ దన పెంపూహింప నట్లుండెఁ ద
న్మోహోద్రేకముఁ దీర్తు నంచు పరిసంబుల్ వల్కి యుల్కించి పూ
ర్వోహాపూరుషకం బెకల్చి సదయుండై తల్ప్రియం జెట్లుటుల్
స్నేహోత్సాహము తేర్పడంగ నలరించెం గృష్ణుఁడా రుక్మిణిన్॥ 185

నారదసందేహ నివారణము.

చ॥ లలిఁ బదియాఱువేల సతులం బదియుం బదియాఱువేల రూ
పులగుచుఁ బెండ్లియాడెనఁట, పోయి కనంగొని వత్తునిప్పు డే
చెలువుననుండునోయనుచుఁ జిత్తమునందలపోసి నారదుం
డెలమిని ద్వారకా నగరికేగి సవిస్మయుఁడయ్యెఁ దత్కృతిన్॥ 186

అతిథిసత్కార ప్రశంస.

సీ॥ కృష్ణస్వభావపరీక్షకై దూర్వాసుఁడరుదెంచి వికటచర్యల నటించి
పాయసవాంఛఁ దీర్చవె కృష్ణయనన ట్లుకూర్చి తెచ్చిన వానిఁ గొంతగుడిచి
తన మేన నలఁదించుకొని కొంత రుక్మిణీకాంత కలందించి యయ్యెఁ దిరస్య
రూపిణిగా రథారూఢుఁడై కొట్టుచు నల్లట పెట్టియూరెల్లఁ జుట్టి

యగ్గరితఁ బ్రేమఁ గ్గరిలనగ్గి డిగ్గనటికి। బుగ్గిపైఁజల్లి పాయసంబునాడకెల్లఁ
బూసితివి కృష్ణ యడుగునఁ బూయవైతి। వఁదుఁదక్షమ తెందుఁ గీడొందవనుచు॥
మ॥ కరుణింపం దలఁపోసి రుక్మిణినటుల్ గాసిల్లఁగాఁ జేసి యా
తరుణింజూచి వెలందులందు నజహత్సౌందర్యసౌభాగ్య వి
స్ఫురణన్నిస్తులవౌదు వీవనిచ నక్షశోభావిభూత్యన్నలిం
బురణించెం దమదేహగేహములు విప్రుండు మెచ్చిరా దంపతుల్॥ 188

## దూర్వాసుని జన్మ వృత్తాంతము.

సీ॥ శ్రుతులశ్వములు చంద్రసూర్యులుఁ జలు భూమిరథము విధాత సారథి సురాద్రి
ధను వనంతుఁడు నారి దారథికుండునై, యమపుంఖ శుచిశల్య హరిశరమున
రుద్రుండు త్రిపురాసురుల సంహరించి మన్మయ్యస్త్రము నిజాంకమందుఁ జేర్చి
కూర్చుండెఁ బంచశిఖుండగు సంయమియయోనత్యమ్మ నెయ్యమ్ముహత్తి॥
కృత్తివాసుండు దుర్వాసుఁడీతఁడని యౌ। నత్రి [illegible]ర్థింపఁ దత్పుత్త్రుఁడయ్యెనతఁడు
నిగ్రహానుగ్రహసమర్థుఁడుగ్రుఁడౌగ్ర। హించి బ్రహ్మాండమును దహించుఁ బెంచుఁ దయను॥

## సుభద్రా పరిణయము.

సీ॥ శపథభంగంబు బీజముగాఁగ విజయుండు తీర్థయాత్రకు వెలుదేరునపుడు
లూచి చిత్రాంగద నేచి వివాహమై యతివేషమున ద్వారవతికి రాఁగ
నతనిచిత్తమెఱింగి హరియంతిపురిఁ జేర్చి పరిచరించుటకు సుభద్ర నునిచి
పశుపతిపూజనెపంబుగా రామాదిఘనుల నంతర్ద్వీపమునకుఁ జేర్చి
తానునింద్రుఁడు స్మరణమాత్రమునఁ గూడి। పెండ్లిచేసి సుభద్రను విజయు ననిచి
హలికి నుకమాన్పి వారికి హరణమొసఁగి। పాండవావృతుఁడై వచ్చె ద్వారవతికి॥

## కైలాసయాత్రా ప్రశంస.

సీ॥ రుక్మిణి వాంఛఁ దీర్చుటకుఁ బుత్త్రార్థియై వాసుదేవుండు కైలాసయాత్ర
కై వెలువడి బదరీవనంబున ఘోరతపమొనర్చుచునున్న తటిఁ బిశాచ
నాయకుండైన ఘంటాకర్ణుఁ డలకృష్ణుఁ డెందొప్పఁ గని తగిలింతు నెప్డు
డనుచు వేఁటాడుచు నాత్మసన్నిధికిరాఁ బ్రశ్నోత్తరములఁ దద్భక్తి నరసి
లోను వెలి నేకరీతిఁ గాఁ దానతోఁచి। ద్విజశవము పావనము దీనిఁ దినుమన నగి
హితమెఱిఁగి సాయుజ్యహేతువైన। దివ్యరూపమొసంగె భక్తికెనగలదె॥

## ప్రద్యుమ్నోపాఖ్యానము.

సీ॥ ప్రద్యుమ్నుఁడై పుట్టెరతిపతి రుక్మిణీకృష్ణులకని విని కీడుమూడు

నని శంబరుఁడు సప్తమనిశీథమున మాయవలన దొంగిలి వాని వార్ధి వైవ
నొకమీను మ్రింగె జాలికుఁడు దానిం బట్టి యిక్షుమతీపురికేగి శంబ
రావరోధమగు మాయావతికొసఁగెఁ దద్గర్భముఁ జించి యందర్భకుఁ గని
పెంచి మాయలు నేర్చి మోహించితాను। రతియగుటఁ దెల్పి పురికొల్ప రక్కసుని వ
ధించి యతఁడు నమ్మాయావతియును రాఁగ। యదుకులము సంతసిలె నారదాభినుతిని॥

## రామకృష్ణుల సంతాన ప్రశంస.

క॥ శరుఁ డుల్ముకుండు రణ।కర్మఠులగు పుత్రులుగఁ బడసి రాముఁడు పుత్రిం
గతిన రుచిం గనకాంగిం। బరసీయగుణఙ్ సుభద్రపట్టికొసంగెన్॥ 193
సీ॥ సరవిఁ బ్రద్యుమ్నుండు చారుచంద్రుండును జారుదేష్ణుండును జారుబాహు
జారుదేహ సుచారు చారుల[illegible]విచారు భద్రచారు సుదేష్ణు లద్రినిభులు
పదుగురు తనయు లొప్పెఁ [illegible]రుమతియను తనయ రుక్మిణియందు జననమైరి
సాంబ సహస్రజిచ్ఛతజిత్సుమిత్ర మిత్ర క్రతు విజయులు ద్రవిడ చిత్ర
కేతు పురజిత్తులనఁగఁ బ్రఖ్యాతిగన్న। సుతులఁ బదుగురఁ గని మిత్రవతియనంగ
వినుతికెక్కిన చక్కని తనయ నొకతెఁ ।గనియె జాంబవతీదేవి మనము దనియ॥
సీ॥ భానుఁ బ్రభాను స్వభాను స్వర్భాను శ్రీభాను బృహద్భాను భానుమంతు
నతిభానుఁ బ్రతిభాను ఫలచంద్రభానునిఁ జారు భ్రమరికను సత్య గనియె
శ్రుతకవివృష వీర సోమక శాంతి భద్రులు పూర్ణిమా సదమ్నులు సుబాహుఁ
డను పదుగురు పుత్రులను గాత్రవతియను తనయ వికర్తనతనయ గనియెఁ
బవనవృష నారగృధ్రాంకవహ్ని నర్థ। నానిలమహాసనత్తుధు లనెడు సుతులఁ
బదువురను భద్రవతియనఁ బరఁగు సుతను। వేడ్కలిగురొత్త గా మిత్రవిందగనియె
సీ॥ వీరచంద్రవృసాశ్వసేనవేగప దామవసుకుంతి శంకువీరపదభిఖ్యు
లగు పదుగురు పుత్రుల నలస్వేతయనంగఁ జెలఁగు పుత్రిని నాగ్నజితియు గనియె
శరవిశూర సుభద్రసంగ్రామజిద్వామ సత్యక ప్రహరణ జయులు హరిచి
రాయుర్బృహత్సేనులను పుత్రులను దామ్రపత్రికయను సుత భద్ర గనియె
బలుఁ బ్రఘోషు సిసింహుని బ్రబలునూర్ధ్వ। సహజు నపరాజితుని మహాశక్తి నజుని
గాత్రవంతుని సుతదశకంబుగా జ। లందమను పుత్రిఁ గాఁ గనె లక్షణయును॥
సీ॥ వినుఁడింకఁ బదియారు వేల నూర్గురియందుఁ బ్రత్యేకముగ సుతుల్ పదుగురేసి
పుట్టిరి వారును బుత్త్రిలఁ గాంచుచు యదువృష్ణిభోజాంధకాదులనఁగ
జగతి నేకోత్తర శతశాఖలైరి॥ ప్రబలిన హరిపుత్త్రపౌత్త్రజనము

నవమూఁడుకోట్లయెన్బదియొనిమిదివేల నూర్గురుగురువులావర్గసంఖ్య
భర్గుఁడైనను గృతజగత్సర్గుఁడైన। నింతయని చెప్పలేరన్న నితరులెన్నఁ
గలరె వలతేని తండ్రి జగత్కుటుంబి। తత్కుటుంబము గాని దిద్ధరణిఁ గలదె॥

శా॥ కుబ్జాకృష్ణులకుద్భవించి సువివేకుండై యుపశ్లోకుఁడ
య్యబ్జాతాసనుపుత్త్రుశిష్యుఁడయి దివ్యజ్ఞానియై తా నను
ష్టుబ్జాలంబునఁ గూర్చి సాత్వతమనం జాపట్టి తంత్రంబదే
న్యబ్జాస్త్రీపరిచారికాపదజమోక్షోపాయమంత్రంబుగన్॥ 198

## అనిరుద్ధవివాహ మహోత్సవము.

సీ॥ స్వస్వవత్సలుఁడు రుక్మిస్వసుతయై తగు రుక్మవతిని శ్రీరుక్మిణీసుతులయందుఁ
బ్రద్యుమ్ననకొసంగి ప్రద్యుమ్నసుతుఁడైన యనిరుద్ధునకుఁ దన మనుమరాలి
రుక్మలోచనయను రుచిరాంగి నొసఁగెఁ దత్పరిణయాగతులైన ధరణిపతులు
పెరరేపఁగా దురోదరమున దబ్బరలాడిన రుక్మిని హలి వధించెఁ
బరిణయానంతరమున దంపతులఁ దోడు। కొనుచు ద్వారకకేతెంచి రనుపమాన
మానసీయోత్సవంబుతో మాధవుడు। లవల బాణాసురుని గర్వమడఁచి విడిచె॥

## ఉషా పరిణయము.

సీ॥ హరదత్తవరమత్తుఁడగుచు బాణాసురుండతఁడు గావలియుండ నతిశయించి
యుండెఁ దత్పుత్త్రిక యుష యొక్కచక్కనిపురుషుతో స్వప్నసంభోగమొంది
ముంచటివలెనుండ మిందెలిసి తదాప్తసఖి చిత్రరేఖ తత్స్వాంతమెఱిఁగి
రాజరూపములెల్ల వ్రాసి చూపఁగ ననిరుద్ధునిఁ జూపి తత్సిద్ధిఁ గోర
యోగబలమునఁ బ్రియుఁ దనకొసఁగ నతని। వలననుష గర్భవతియౌటఁ దెలిసి బాణుఁ
డతని ఫణిపాశమునఁ గట్టె నని విని హరి। శోణపురికేగి చేసిన చొప్పు వినుఁడు॥

## బాణాసురగర్వ పరిహారము.

సీ॥ వాసుదేవుండు కైలాసయాత్రకుఁ బోయి యుపమన్యునుపదేశమొంది ఘోర
తపమొనరింపఁ బ్రత్యక్షమైత్ర్యక్షుండు మున్ను వరంబిచ్చి యున్నదియును
బ్రహ్మనునకుపధింపఁ ద్వదీయులనటంచు మున్ను వరంబిచ్చియున్నదియును
గారణంబులుగ రక్షకుఁడై యెదిర్చిన ఫాలాక్షునంతలోపల విదిర్చి
సమవివాదవివాహముల్ శ్లాఘ్యములని। పట్టి బాణాసురుని జతుర్బాహుఁ జేసి
విడిచి యుషతోడ ననిరుద్ధు వేడ్కగాఁగ। దోడ్కొనుచు వచ్చె ద్వారకాదుర్గమునకు॥

